శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః.

# వైదికమత సామరస్యము

శ్రీకంఠీయ గ్రంథమాల - ప్రథమ బిల్వము.



ఇయ్యది

శ్రీమన్నిగమాగమాంతోపాదిత శైవాచారసంపన్నులు, త్రిలోకగురు మల్లికార్జున పండితారాధ్యవంశసంభవులు, గౌతమ సగోత్రికులు, సత్కార్యధురంధరులు, హైదరాబాదు రాష్ట్రి నిర్మల వాస్తవ్యులు, కీ. శే. బ్ర. లో. నిర్మల రామనాథారాధ్యులవారి ద్వితీయ పుత్రులైన విద్యాభూషణ, పండిత, నిర్మల శంకరశాస్త్రిగారిచే రచింపబడి ఇష్టలింగమున కంకితముగా ప్రచురింపఁబడియె.

ప్రతులు 500

విజయ సంవత్సరాది.

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః.

# ఉపోద్ఘాతము

శ్రీ పరమేశ్వర దివ్యవాణీ సముల్లాసాత్మక వేదమునందు ప్రోక్తములు వైదికములనియు; శివానుగ్రహమునకు సాక్షాత్పరంపరయావా కారణములైన సిద్ధాంతములు విధానములున్న శిష్టజనగ్రాహ్యములైన మతములనియు; పరస్పర విరోధములేమి సమన్వయము చేయుట సామరస్యమనియు; గ్రహింపనగును.

ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు మతములా? శైవాదులు మతములా? అను ఆ శంక కలిగినపుడు-ప్రథమములు-శైవాదులతో సామరస్యముఁజెంది ఋషిసమ్మతములనియు, ద్వితీయములు-ద్వైతాది సమ్మిశ్రములై అనాదికాలసిద్ధములై ఆచార్యప్రచారాభివృద్ధములై నిరుపపద మతములనఁ బఱగుచున్నవనియు తేటపడును.

మతములకు వైదికత్వము నంగీకరించినవారు వాని సామరస్యము నాకాంక్షించకుందురా? ఆస్తికులకు వైదికత్వము, తత్సామరస్యంబు నుపాదేయంబులు. దోషముల పరిహారములఁ జెప్పుచు గుణములను ప్రశంసించుటఁగూడ ఉత్తమోత్తమమైన సామరస్య మనఁబడును. వైరస్యము నాలోకించు మహాశయులకు ఒక పార్శ్వమందు సామరస్యము పొడగట్టుచునే యుండును.

శైవాది షణ్మతములలో శైవ వైష్ణవములే పెక్కు చోట్ల గానఁబడుచున్నవి. శాక్త గాణాపతములు తత్తత్తతః శైవులయందే సమ్మిశ్రములు; సౌరకౌమారములు క్వాచిత్కములనియే చెప్పవచ్చును.

"త్రయీ, సాంఖ్య యోగాదులు ఋచులనఁ బఱగి మతములగుచు ఋజుత్వ కుటిలత్వప్రియు క్తములుగా శివునిఁ జెందింపఁజేయునవై శైవమునందే పర్యవసితములగునట్టివని" పుష్పదంతుఁడు-"పయసాం అర్ణవ ఇవ" అను దృష్టాంతముతో వైదికమతసామరస్యమును చక్కగా విశదపరచెను.

శ్రీ నీలకంఠీయ శివాద్వైతమునకు శ్రీ శంకరాచార్య రామానుజాచార్య మధ్వాచార్యాద్యనంతరము కలిగిన దుష్ప్రచారమును ఖండించి "శివ ఏవ కారణం, శిష్టాః సర్వే శివం ప్రపన్నాః, రత్నత్రయపరీక్షా" ఇత్యాది సద్గ్రంథములతో తగు సామరస్యమును నిరూపించిన శ్రీమదప్పయదీక్షితేంద్రాదులు వైదికమతములకు కడుంగడు ఆదర్శప్రాయులైనారు.

వేదము-ఎట్లు అపౌరుషేయము అనాదియో, వైదికములున్ను అట్లే నిత్యసత్యములనియు, ఆచార్యులు వైదికములనుద్ధరించువారే గాని నూతనముగా ఆవిర్భవింపఁజేయువారు కారనియు, దుర్వివాదముల నేర్పడిన వైరస్యమును బోకార్చుటయందే సామరస్యముయొక్క తాత్పర్యమనియు అభిప్రాయపడుచున్నాను.

ఈ సామరస్యమునకు స్వమతసిద్ధాంతాభినివేశము గర్భితమై యుండునని కొందఱు రపోహపడువారు లేకపోలేదు.

తథాపి హృదయములో దాగియుండు యాథార్థ్యమును విబుధు లకు విజ్ఞప్తి చేయుటయే ముఖ్యమైన ఉద్దేశమను ధైర్యముతో యథాశక్తి వ్రాయ సాహసించి - విరోధము క్షణేక్షణే ఆభా సితమై అంతరాత్మ చూపుచున్న సమన్వయము - వెలుబడు టకు యుక్తియుక్తముగా ప్రమాణబద్ధముగాను స్ఫురించు చున్నందున స్వతంత్రించి వ్రాసితిని. ఇందు భాషాలోపములు, విషయాసమగ్రతయు, ప్రాయశః మృగ్యములని విశ్వసించు చున్నాను. ప్రియులైన పండితులు మహానుభావులున్ను ఇద్దానిని బహుశః అభినందించగలరు. సమర్థులు విమర్శించి గుణములనే ప్రకటింతురు. చదువరుల సమరసబుద్ధికి ఇందలి సామరస్యము నికషోపలముగా నున్నయది.

అస్మన్మతాచార్యపూర్వికులు, శ్వేతాచార్య శిష్యులు, ప్రస్థానత్రయ భాష్యకర్తలు, నిరంతర శివయోగనిరతహృద యులు నగు శ్రీ నీలకంఠ శివాచార్యులవారి పర్యాయనామము, పుత్రీభూతబాలుని వ్యవహారనామంబు నగు "శ్రీకంఠ" శబ్ద ముతో కూడియున్న గ్రంథమాలను దాదాపు ఎనిమిదివత్సర ముల క్రితము కొందరు మిత్రులతోగూడి సంకల్పించి యిప్ప టికి నీశ్వరానుగ్రహమువలన ప్రథమ బిల్వమును ప్రచురింప గలిగితిని.

ఇయ్యది శ్రీ పార్వతీ రాజరాజేశ్వర ప్రీతిమూలమై పరంపరాభివృద్ధితో ప్రచారముఁజెంది ఆచంద్రతారార్కము విలసిల్లుగాత యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త.

శ్రీ శివాభ్యాన్నమః.

# "వైదికమత సామరస్యము" "శివాద్వైతము"



ఈ రెండు పొత్తములను ప్రచురించుటకు వలయు ద్రవ్యమును చెరుకుపల్లి వంశవారిధిరత్నమగు శ్రీయుత భూమరెడ్డిగారు సమర్పించి తమ యశశ్చంద్రికలను వ్యాపింపజేసియున్నారు. సంగ్రహముగా వీరి వంశచరిత్ర క్రిందు పొందుపరుచబడుచున్నయది,

ఉపనయతు మంగళం నః - పరివిలస త్సర్వమంగళాలయః శ్రీమాన్ ।
హిమకరకిరణ నిగుంభిత - మకుటతటీ భాసమాన దిగ్వలయః ॥

శ్రీ పరమేశ్వరుని సృష్టములో చేరియున్న పుణ్యభూమియగు నీ యార్యావర్తంబున కృష్ణా గోదావరీ నదుల మధ్య గోలకొండ సంస్థానములో మిక్కిలి సమృద్ధితో పేరెక్కియుండు నిజామాబాదు జిల్లాలో గల ఆర్మూరు తాలూకాయందు "గోనుగొప్పుల" యను చిన్నగ్రామము-మనోహర స్థలసంపన్నమై వినయవిధేయతలు గల అష్టాదశవర్ణప్రజలతో కృషి గోరక్ష వాణిజ్యాదులతో విరాజిల్లుచున్నయది. గ్రామీణుల కుపయుక్తమగు నొక చక్కని యేరు సమీపమందు ప్రవహించుచుండును. ఇద్దాని నిర్మాణాది సమయమందు "చెరుకుపల్లివారు" అను ఉత్తమవంశసంజాతులేతెంచి యిట బస జేసి సామాన్యప్రజను దుష్టబాధనుండి తప్పించి విశాలమగు భూప్రదేశమునంతయు సాగుబాటు చేయించుచుండిరి. దాన లోకులు—స్థానికులే గాక గ్రామాంతరస్థులు గూడ

బాగుగా జీవనాధారము కలవారైరి. క్రమముగా పూరిగుడిసెలు గృహములాయెను. వైశ్య బ్రాహ్మణులకు వసతి లభించెను. పాఠశాలలు నెలకొనెను. ఇప్పటికిని ప్రజారంజనము జరుగుచుండుటంజేసి పూర్వములో వీరు క్షత్రియులని చెప్పవచ్చును.

పాతివ్రత్యము, స్వాధీనభార్యాత్వము, పుత్రికాపోషణ, దేవబ్రాహ్మణ మర్యాద, సత్యన్యాయములు ఇత్యాది విశేషములతో కూడియుండు వీరి కుటుంబాచారములు సద్వంశత్వమును చాటుచున్నవి. అన్నిటికన్న నతిశయముగా గురుభక్తి వీరికి నొప్పారుచున్నయది. ఇంతేగాక వీరీ గ్రామములో శివాలయముముందు బాటసారుల సౌకర్యార్థము గచ్చు సిమెంట్ కట్టడముతో నొక ధర్మశాలను నిర్మింపజేసియున్నారు.

శ్రీమత్త్రిలోకగురు మల్లికార్జున పండిత వంశీయులు, గౌతమగోత్రోద్భవులు నిర్మల నివాసులు నగు ఆరాధ్యులవారు – వీరి గురువులు; అనుక్రమముగా ప్రస్తుతము శ్రీరామనాథారాధ్యులవారి పుత్రులు – అంబయ్య సిద్ధాంతి, శంకరశాస్త్రి, విశ్వనాథశర్మ అను ముువ్వురు – మధ్యమధ్య వచ్చుచు వీరివలన విశేషసన్మానముం బడయుచు తృప్తులై యొసగుచున్న శుభాశీర్వాదములకు వీరు పాత్రులగుచుందురు.

ఎనిమిదవ పురుషాంతరము నడుచుచున్న వీరి వంశము–శాఖోపశాఖలుగా పెరుగుచు ఎట్టి విషమపరిస్థితులయందైన నుపద్రవములం జెందక సంపూర్ణ శివానుగ్రహము కలదై మొత్తము నూర్గురితో నిండియున్నది. వీరిలో కొందరు రాజకీయ విద్యాధురీణులు, మరికొందరు – వ్యవసాయవేత్తలు,

కొందరు - యోగక్షేమానుభవశాలురు, మరికొందరు - లోక వృత్తాంతాభిజ్ఞులు నున్నారు.

యువకులు-ఆధునికసంస్కారదూషితులుగాక పూర్వాచారానుమోదకులై పెద్దలకు లొంగియుందురు. బాలురు - విద్యాభ్యాసపరాయణులై శీలముతో నుండువారు. బాలికలు-ప్రాథమికవిద్య నభ్యసించుచు దైవభక్తి కలిగియుండువారు. వృద్ధులు-పిన్నవారిని ప్రేమించుచు కుటుంబపోషణ తత్పరులై అతిథ్యభ్యాగతులను సత్కరించుచుందురు. కన్యలు, యువతులు, పెద్దవారును పతి సుత సహోదరాద్యనురాగముతో కలహవైమనస్యములు లేకుండా పరస్పర స్నేహముగలవారై శుభకార్యములం దేకీభవించుచు ఉల్లాసముతో కాలము గడుపువారు.

సర్వథా ప్రశంసనీయమగు నీ వంశములో ఆరవ పురుషాంతరమువాడగు శ్రీయుత "లక్ష్మారెడ్డి" అనువారు-చిన్ననాటినుండి ప్రపంచభారమును వహించుచు అగ్రజానుజపుత్రులను సుతనిర్విశేషముగా కాపాడుచు వచ్చుచున్నారు. తనకు పుత్రసంతానము లేకున్నను " భ్రాతౄణా మేకజాతానాం " అను మనుస్మృతి ప్రమాణము ననుసరించి పుత్రవంతుడననియే భావించుచు - విదురుడు ధృతరాష్ట్రున కుపదేశించిన రీతిగా జ్ఞాతులను పెంపొందించుచు శాశ్వత పుణ్యయశస్సులను సంపాదించుచున్నారు. సంప్రతి ఈతని ప్రాయము - డెబ్బది వత్సరములు. హితము మితము నగు సంభాషణ జేయుచు సమస్తమును స్వీయముగా నవలోకించుచు శివగురు స్మరణ గావించుచుండును. ఇట్టి ఉదారచరితుడగు మహాపురుషునికి

సదాశివుడు చిరాయురారోగ్య భాగ్య విజ్ఞానముల ననుగ్రహించి కాపాడుగాత !

ఈతని యన్న " మల్కారెడ్డి " అనువారు - పరమ ధార్మికులై తమ గురువులైన రామనాథారాధ్యులవారితో నొకయేట మహాశివరాత్రికి విశేషాన్నదానముతో కూడిన దీపమహోత్సవమును గావింపజేసి ధన్యజీవులైనారు. ఇక తమ్ముడు "చిన్నగంగారెడ్డి" అనువారు-పూర్వలక్షణపరిపాలన, ఔదార్యము మున్నగు సద్గుణములు కలిగి సుమారు మూడు సంవత్సరములక్రితము కైలాసప్రాప్తులైనారు. మల్కారెడ్డి పుత్రులు - పరస్పర సోదరప్రేమ, భక్తిభావనలు కలవారై పినతండ్రిమాటను జవదాటకుందురు. చిన్నగంగారెడ్డి కుమారులలో జ్యేష్ఠుడైన " భూమరెడ్డి " అనువారు - తమ ధైర్య ఔదార్యాదిసద్గుణసంపత్తి ప్రకాశింపనీపొత్తము నచ్చొత్తింపవలయు ధనము సమర్పించి చిరకాలస్థాయి కీర్తిప్రతిష్ఠలను సంపాదించియున్నారు. తదితరులందరును శ్రద్ధాభక్తి వినయ విధేయాచారసంపన్నులై యోగ్యముగా వర్తించువారు.

ఇట్టి గుణశాలురైన వీరు- విరోధి సం॥ శ్రావణములో తమ గురుమధ్యములగు విద్యాభూషణ, పండిత, శంకరారాధ్యులవారిని సవిద్యార్థి ప్రభృతిపరివారముగా రప్పించి విశాలమగు తమ కోటయందు గల ప్రత్యేకగృహమందు శ్రీ పార్వతీ రాజరాజేశ్వరుల మహారుద్రాభిషేకము లక్షబిల్వార్చనంబును శ్రీ గణేశ నవరాత్ర బిల్వయాత్రా మహోత్సవములను వేద బ్రాహ్మణ సత్కార పురస్సరమైన గ్రామాన్నదానమును

దాదాపు రెండువేల రూపాయులతో జరిపి తమ ధర్మశ్రద్ధను ప్రకటించిరి.

సర్వాంతర్యామి యగు శ్రీ మహాదేవు డీ వంశవృక్షమును పల్లవ పుష్పఫలాదులు కలిగియుండునట్లు సదా అనుగ్రహించుచు ఇతో౽ధిక భాగ్యభోగ్యములను దేవతాగురు విప్రభక్తిని ప్రసాదించి రక్షించుగాత యని మా హృదయపూర్వక శుభాశీర్వాదము.

ఇతి శమ్.

— —

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః.

# పండితాభిప్రాయము

శ్రీ విద్యాభూషణ, పండిత, నిర్మల శంకరశాస్త్రిగారిచే రచింపబడిన "వైదికమత సామరస్య" మను గ్రంథము నామూలాగ్రముగా చదివితిని.

జైమిన్యాది దర్శనములను మొదట సంగ్రహముగా నుల్లేఖించి శైవ వైష్ణవ శాక్త గాణాపత సౌర కౌమారము లనంబడు షణ్మతములను విమర్శించియు అవ్వాని సామరస్యము శైవమునందే కలదని న్యాయ వేద వేదాంతాగమ సూత్రగీతా దుల కవిరుద్ధముగా యుక్తియుక్తముగా విశదపరచినారు.

శంకరదర్శనముఁగూర్చి "జనుల బాహ్యాముష్మిక భక్తి విశ్వాసరహితుల నొనర్చ నద్వైతమును శంకరాచార్యుల వారు ప్రకటింపవలసివచ్చెనని" వ్రాసిరి కాని శంకరుని ప్రచారమునకు పూర్వము ఇతర పండితులచే ఖండింపబడఁగా శేషించిన బౌద్ధాదుల నాస్తికమతముల ననుసరించువారిని ఆస్తిక మతమునందు ప్రవేశింపజేయుటకు "జగన్మిథ్యా బ్రహ్మ సత్యం" అని చెప్పుచు (ప్రచ్ఛన్న బౌద్ధమైన) అద్వైతమును నిరూపించవలసినవారైరి. అని వ్రాయవలసియుండెను.

శ్రౌతశైవులకు సమాధిఁగూర్చి గృహ్యసూత్రములే గాక "మృత్తికే దేహిమే పుష్టిం-త్వయి సర్వం ప్రతిష్ఠితం, త్వయాహతేన పాపేన గచ్ఛామి పరమాం గతిమ్" ఇత్యాది శ్రుతివాక్యములు గూడా ప్రమాణములుగా గ్రహింపబడు చున్నయవి.

11, 12 పేజీలలో గల సగుణత్వ నిర్గుణత్వములను సమర్థించు విషయము మిక్కిలి సమంజసము. ౧౧ పేజీ

యందలి ౨౨, ౨౩ పంక్తులలో “కలిగియుండుట సగుణత్వమనియు, సత్యసంకల్పత్వాద్యప్రాకృత గుణములును కలిగి యుండుట సగుణత్వమనియు, ౧౨ పేజీ యందలి ౪ పంక్తిలో “ నిర్గుణత్వమనియు ” అనునవి ముద్రాపకదోషములుగా గ్రహించి ౧౧ వ పేజీయందు “ కరచరణాద్యవయవములు ప్రాకృతగుణములును లేకుండుట నిర్గుణత్వమనియు” ౧౨ వ పేజీలో “సగుణత్వమనియు” అని చదువవలసియుండును.

కౌమారమతమునుగూర్చి షణ్ముఖ షణ్ముఖసమర్థనము హృదయంగమమైనది. ఏతాదృశప్రశంసనీయములు గ్రంథాది నుండి సమాప్తివరకు అధికములుగా ఉన్నందున విస్తరభీతిచే విరమించుచున్నాను.

శ్రీ శాస్త్రిగారి గ్రంథరచన శైలి అనన్యసులభమై పక్షపాతములేని పెద్దలకు రుచించునది; స్వరచితపూర్వములతో తనివినొందక ఆంధ్రరాష్ట్రము రాబోవు ఈ శుభసమయమందు వేదాంతదర్శనముల సామరస్యమును నిరూపించు ఏతాదృశ ఆంధ్ర రచనములను శివాద్వైత వేదాంత పారంగతులగు వీరు ఎన్నియేని ప్రచురింపఁజేసి పాఠకులకు సంతృప్తి జనకు లగుదురుగాత యనియు వీరి రచనలు శైవులకు శైవ భక్తులకున్ను సుసన్నిహితములై శివానుగ్రహపాత్రము లగుగాత యనియు ఆశింపించుచున్నాము.

ఇట్లు
న్యాయవేదాంతాయుర్వేదాభిజ్ఞ,
**మూ. రాజశేఖరశాస్త్రి,**
ప్రభృతి శైవపండితబృందము, హైదరాబాద్.

శ్రీ శివాభ్యాన్నమః.

# శుభాభినందనము

శ్రీ గోనుగొప్పులపురే – స్థితః శ్రీమాన్ ధురంధరః ।
లక్ష్మీశ్వరాహ్వయో ధీమాన్ – సత్కార్యస్థాపకాగ్రణీః ॥ ౧
శ్రీ చెరుకుపల్లి వంశాబ్ధౌ – శీతభాను రివోత్థితః ।
ఆస్తే వృద్ధః సదాచారః – దేవబ్రాహ్మణ భక్తిమాన్ ॥ ౨
తదగ్రజ సుతాః పంచ – మాణిక్యార్యశ్చ లక్ష్మయః ।
బాగాహ్వయో భీమరెడ్డిః – శంకరాఖ్య శ్చకా సతే ॥ ౩
బుద్ధిమంతో గురౌ భక్తా – వినతాః కుశలాశ్చ తే ।
పరస్పర స్నేహయుక్తాః – పితృభక్తిపరాయణాః ॥ ౪
తస్యానుజస్య పుత్రౌతు – భూమరాజార్యనామకౌ ।
జ్యేష్ఠో వదాన్యో మతిమాన్–కనిష్ఠ శ్చారువర్తనః ॥ ౫
అపి తద్బాంధవాః సర్వే – స్వకులాచారతత్పరాః ।
గంగా కృష్ణార్య గోవింద – నరసింహాదయోమతాః ॥ ౬
శంకరాఖ్యః సుశీలశ్చ – గంగాధర నృసింహకౌ ।
శ్రీనివాసశ్చ రామార్యో – నారాయణముఖా వరాః ॥ ౭
ఏతే విరోధివర్షే శ్రీ – శ్రావణే శంభుపూజనం ।
మహారుద్రాభిషేకం చ – లక్షబిల్వార్చనం తథా ॥ ౮
నభస్యే శ్రీగణేశస్య । నవరాత్రోత్సవం ముదా ।
గ్రామాన్నదాన మలఘు – శంభో ర్రాజ్ఞా పురస్సరం ॥ ౯
కారయామాసు రత్యంతం – శ్రద్ధయా శివతృప్తయే ।
గురోః సన్మాన మతులం । సర్వథా చక్రు రుత్తమాః ॥ ౧౦
ఏతాన్ సర్వాన్ సాంబమూర్తిః – సదా రక్షన్ పరాత్పరః ।
ఆయు ర్యశోజయం వృద్ధిం – దద్యాచ్ఛ్రీకరుణాకరః ॥ ౧౧

శ్రీ శివాభ్యాన్నమః.

# వైదికమత సామరస్యము

శ్రీ పరమేశ్వరునిచే మానవు డభివృద్ధి పొందతగిన పద్ధతులను బోధించు ఏకైకప్రమాణముగా వేదము ఆవిష్కరింపబడియున్నది. ఇం దనేక ఐహిక ఆముష్మిక ధర్మములు ప్రతిపాదింపబడినవి. " చోదనాలక్షణో ధర్మః " ధర్మమనగా— ఇహమునకు పరమునకును విరుద్ధమగు అధర్మమునుండి తొలగించి న్యాయమార్గములో నడచుటకు ప్రేరేపించునట్టిది. ఇట్టి ధర్మమును త్రికరణశుద్ధిగా విశ్వసించి ఆచరించువారికి శ్రేయస్సు సర్వదా సిద్ధము. ప్రవృత్తిమూలమనియు,నివృత్తిమూలమనియు ధర్మము సర్వసాధారణముగా ద్వివిధము. నివృత్తిధర్మమునే మోక్షోపాయమగు నాల్గవ పురుషార్థమని పెద్దలు వాక్రుచ్చిరి. అర్థకామములకుసంబంధించిన యోగ్యాచరణ ప్రవృత్తియనియు వైరాగ్యాది సాధనచతుష్టయముతో గావింపబడు భగవదుపాసన నివృత్తియనియు వివేకము. సృష్ట్యాదినుండి నేటివరకు బయలుదేరిన మతములలో చాలావరకు ప్రవృత్తిప్రధానములనియే చెప్పనగును పైపైన నివృత్తి మిషగాగొని లోలోన సమస్తంబును ప్రవృత్తిపరముగా పరిగణించు బహుమతములు లేకపోలేదు. జైమిని, పతంజలి, కపిలుడు మొదలగువా రిట్టి మతములనే సిద్ధాంతీకరించియున్నవారు. కర్మయే శ్రేయస్సును నిఃశ్రేయస్సు నిచ్చునదని జైమిని విశదపరచెను. అణు పరమాణువుల సంయోగరూపముగా నున్న నీ సృష్టికి నీశ్వరుని

కేవల నిమిత్తకారణునిగా భావించవలెనని పతంజలి తెలియ జేసెను. ఈ జగత్తున కంతటికి ప్రకృతియే ఉపాదానము. జీవుడు ప్రకృతిని వేరుగా తలచి నిర్ముక్తుండు కావచ్చునని కపిలుడు సముల్లేఖించెను, ఇట్లే అనేకములు ప్రమాణాభాస ప్రచారసిద్ధములై యుండెడివి. పూర్తిగా నివృత్తిదూరములై ప్రవృత్తిని కొద్దిగా గ్రహించు కొన్ని వైదికాభాసమతములు గూడ నేర్పడియుండినవి. ప్రవృత్తి నివృత్త్యుభయ బాహ్యములై స్వేచ్ఛాకామార్థములగు జైన, బౌద్ధ, కాపాలిక, చార్వాకాది మతములు నాస్తికములుగా బయలువెడలినట్టివి. అచలాది శూన్యపద్ధతులు నిట్టివే.

ప్రవృత్తిని నివృత్తిని సమానముగా పరిగ్రహించి భక్తితో రెంటియొక్క సామరస్యమును కనఁబఱచు మతములు వైదికములని చెప్పఁబడును. ఇట్టి యీ వైదికములందు ప్రధానముగా నున్న ఉపాసనారూపమగు భక్తికి కర్మసాహిత్యము తప్పనిసరియైనది. వర్ణాశ్రమాచారరూపమగు కర్మ లేనిది వైదికము కాజాలదు. జ్ఞాన(ఉపాసన) రహితమగు భక్తి శుష్కమై నిష్ప్రయోజన మగుచున్నది. జాడ్యముతో కూడిన వైరాగ్యమువలె భక్తిలేని ముముక్షుత్వము వ్యర్థము. "భక్తిః పూజ్యేష్వనురాగః" తనకు ఇష్టమైన తనకంటె పైవాని యందు చూపబడు ప్రేమయే భక్తి యనబడును. ఇట్టి భక్తిని తదితరులందు కలిగియుండుటకన్న భగవంతునియందు ప్రదర్శించుటయే శ్రేష్ఠమని మతాచార్యులందరు నిర్ణయించిరి.

భగవంతునికి రూపగుణాదు లుండిననేకాని భక్తుడగుటకు వీలులేదు. నిర్గుణము, నిరాకారము నగు తత్త్వమునందు

భక్తి కలిగియుండుటకు అట్టి బ్రహ్మను సాక్షాత్కరించుకొను యత్నము చేయుటకు నవకాశము లేదు. పరమేశ్వరుడు సగుణుడై సాకారుడుగా నుండుననియే భక్తిప్రధానములైన వైదిక మతముల యాశయము, నిర్గుణబ్రహ్మకు జగత్తు సృష్టించు సామర్థ్యము లేదు. ఒకవేళ యున్నదనిన చో సగుణమగును. జగత్తునకు బ్రహ్మకును సంబంధమే లేదనినయెడల కార్య కారణముల యొక్కయు, ఉపాస్య ఉపాసకుల యొక్కయు భోక్తృభోగ్యములయొక్కయు, సుకృత దుష్కృతఫలానుభవము యొక్కయు, బంధమోక్షాదులయొక్కయు వ్యవస్థయే లేకుం డును.

బ్రహ్మ జగత్తులు కారణకార్యములనియు, కార్యము స్థూలమనియు, కారణము సూక్ష్మమనియు, స్థూలరూపమును విడనాడి సూక్ష్మము నన్వేషింపవలెననియు, స్థూలసూక్ష్మములు రెండును సగుణములేయనియు,ఇందొకటి నిర్గుణమైనచో కారణ కార్యభావము కుదురదనియు వైదికమతప్రవక్తల నిర్వచనము.

జగత్తు సత్యమై సవికారమనియు, బ్రహ్మ నిత్యసత్యమై నిర్వికారమనియు, సవికారమగు జగమునందావిర్భూతులగు జీవులు-బ్రహ్మను సగుణముగా భావించి నిర్వికారులు కావలె ననియు ఆచార్యులే వేదాధారముగా విశదపరచిరి.

బ్రహ్మకు గల సగుణత్వము నానావిధముగా వినబడు చున్నను శక్తి కుమార గణపతి విష్ణు సూర్యాది దివ్యరూపము లతో ముఖ్యముగా విలసిల్లుచుండునని యుపనిషత్సమ్మతము.

బ్రహ్మయొక్క సహచారిణిగా శక్తిని;

దివ్యలీలారూపమునకు పుత్రులుగా కుమారగణపతులను;

శక్త్యపరరూపుడైన ఆదిపురుషునిగా తత్త్వవేత్తనుగా విష్ణువును;

మహేశ్వరుని దక్షిణనేత్రముగా సూర్యుని;

ఇత్యాది సంబంధములతో ఉపాస్యములగు నానా దేవతల నామరూపములను వేదము వర్ణించుచున్నయది. పంచభూతములు, సూర్యచంద్రులు, జీవాత్మ భగవంతుని అష్టమూర్తులని మరియొక విభాగము. చతుర్ముఖాది బ్రహ్మలు, ఇంద్రాద్యష్టదిక్పాలురును పరమేశ్వరుని విభూతిజాతములో చేరినవారే. అగ్న్యంశము, అగ్నిభిన్నము నగు జఠరాగ్నియు వైశ్వానర శబ్దముతో బ్రహ్మరూపముగా ప్రశంసింపబడి యున్నది. వాయుభిన్నము వాయువునకు ప్రాణము-పంచవిధమై దేహజీవ సంబంధమును నిలుపుచు శివరూపము గానే పేర్కొనఁబడుచున్నది. ఇట్లనేకవిధములుగా నుండు సగుణుడైన పరమాత్మను-అనాదికాలమునుండి బద్ధుడై యుండు జీవుడు తన భ్రమప్రమాదము లంతరించి స్వయంప్రకాశమానుడగుటకు-ఉపాసించు విధానములే మతములగుచున్నవి.

పూర్వసంస్కారము ననుసరించి ఆచార్యుల బోధలఁబట్టియు భక్తులు-తమతమ కిష్టమగు రూపమును పూజించి ధ్యానించి తరించుచుండిరి. అవతారపురుషులైన రామకృష్ణాదులుగూడ తమతమ యవతార ప్రయోజనములను సాధించుటయేగాక జ్ఞానులై పరమేశ్వరు నుపాసించినవారు గావున నుపాస్యులైరి. పరాభక్తికలవారు - సర్వంబును శివమయం

బను జ్ఞానము దృఢముగా కలవారగుటఁజేసి "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అనునట్లు పరమాత్మలుగా భావింపఁబడుచున్నారు.

ఇట్టి భక్తులు ఉపాసనలు-వేదోచితధర్మముతో కూడినచో వైదికములనియు, తద్రహితము లవైదికములనియు సారాంశము.

ఉపాసనల కాధారములగు వేదాంతముల ననుసరించి బయలుదేరిన మతములలో మూడు సిద్ధాంతము లిమిడియున్నవి. ఇందు మొదటిదగు విశిష్టాద్వైతమును శ్రీకంఠ శివాచార్యులవారు, రెండవదైన అద్వైతమును శ్రీ శంకరభగవత్పాదులవారు, మూడవదైన ద్వైతమును మధ్వాచార్యులు ప్రచారములోనికి తెచ్చినవారైరి. కలియుగాదిలో బౌద్ధ, జైన, చార్వాక, కాపాలికాది మతములు విరివిగా వ్యాపించి యుండ శ్వేతాచార్యానుగృహీతుడైన శ్రీకంఠశివాచార్యుడు విశేష పాండితీయోగబలముతో పై దుర్మతముల ఖండించి శివాద్వైతమును స్థాపించెను. ఆ తరువాత శంకరుడు-బాహ్యముగానుండు భక్తిమాధ్యము విడిపోవుటకై సర్వజ్ఞతాదిసంపన్నుడగు సదాశివునికి నిర్గుణత్వమును కల్పించి జీవజగత్తుల కాభాసత్వమును చూపవలసినవాడాయెను. "జగన్మిథ్యా బ్రహ్మ సత్యం" అనునట్లు చేతనాచేతన సమ్మిశ్రమగు జగత్తు - వారి దృష్టిలో మిథ్య యైనది.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ సమస్త ప్రపంచము బ్రహ్మాత్మక మైనది. అనగా అన్నిటియందు పరమాత్మ

అంతర్యామిగా నున్నవాడు. (దీని నంతర్యామి బ్రాహ్మణము విశదముగా వివరించినది.) "తజ్జలా నితి శాంత ఉపాసీత" ఉపాసకుడు-శమదమాదిసంపన్నుడై బ్రహ్మాంతర్యామికమగు జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి లయములు బ్రహ్మవలననే జరుగుచున్నవని జగత్తును బ్రహ్మరూపముగా నిశ్చయించుకొని జగదేకకారణమగు బ్రహ్మ నుపాసింపవలెనని శ్రుతి చెప్పుచుండ బ్రహ్మకార్యమగు జగత్తు అసత్యమెట్లగుచున్నదో దురూహ్యము.

యద్యపి—"ఏత త్తతో భవతి" జీవుని బద్ధదశ యంతరించిన తర్వాత సమస్తంబును శాంతిసమృద్ధము, అనాది ముక్తము నగు శివరూపముగానే ప్రకాశించునను వాక్యార్థముం బట్టి - పరిదృశ్యమానంబగు జగత్తు నిత్యము కాదని" చెప్పవచ్చును. తథాపి "జీవజగత్తులకు స్వరూపవినాశము లేదను" విషయము-బహ్వాచార్య సమ్మతమగుటను; జీవున కస్తిత్వమే లేనియెడల "కర్తా శాస్త్రార్థవత్వాత్" శాస్త్రముచే నుపదేశింపబడు నిత్యనైమిత్తికాది కర్తృత్వంబును, "భోగమాత్ర సామ్యలింగాచ్చ" ముక్తుడు భగవంతుని నిరవధికానందము ననుభవించుటను శివసముడగునని చెప్పుటయు, మరియు వ్యాస సూత్రములందు కొన్నిటితో వరుసగా నిరూపింపబడిన నిత్యత్వ, జ్ఞాతృత్వ, అణుత్వాది ధర్మంబులు ననుపాదేయంబులగును.

జీవునికి శరీరేంద్రియాది మమకారము మితిమీరకుండుటకు అహంకారము దుష్టము గాకుండుటకును శంకరుని జీవ జగదాభాసత్వవాదము కొంతవర కుపయోగించినదని చెప్ప

వచ్చును. ముక్తి-ఏకవిధమనియు, భగవంతు డొకడేయనియు మహామహులందరు నిర్వచించియుండ సగుణ నిర్గుణత్వ భిన్నముగా ముక్తికి ముక్తిప్రదునకును అంగీకరింపబడిన ద్వివిధత్వము-విచారణీయముగా నున్నయది. కాని యద్వైతాచార్యులనేకులు సదాశివునే పరబ్రహ్మగా నిర్ధారించి "శివోఽహం" భావనతో శివజీవైక్యమును కనుంగొరచియుండుట ముదావహము. తత్సమ్మతమగు సగుణభక్తిమార్గములో పెక్కురు శంకరు నారాధించియే తరించుచున్నారు. "సదాశివః పరం బ్రహ్మ-సాంబమూర్తిః సనాతనః" అని శ్రీమదప్పయదీక్షితేంద్రులు వాక్రుచ్చి చతురధికశత ప్రబంధములతో శైవమును విపులీకరించిరి. ఈతడు శివభక్తివలె విష్ణుభక్తి కలిగి వైష్ణవపక్షముగా గూడ వాదించివాడని కొంద రసభిజ్ఞులు పలుకుచుందురు. "రామానుజ శృంగభంగము, తప్తముద్రాంక విద్రావణము, శివకర్ణామృతము" మొదలగు గ్రంథములను పరిశీలించినచో శ్రీ దీక్షితులవారి యాథార్థ్యము వివరముగా తెలియగలదు. "రత్నత్రయ పరీక్ష" అను గ్రంథమునందు శక్తివిష్ణువులను శివకోటిలో చేర్చి జీవకోటిభిన్నమగు రత్నత్రయములో ఒకదానికన్న నొకటి శ్రేష్ఠములనియు ఉపాసకుడీ మూటిని బాగుగా విచారించుచు ఏతత్సమ్మిశ్రమగు భగవత్సదాశివ తత్త్వము నుపాసింపవలెననియు, స్థూలదృష్టితో కనుగొనువారికి-విష్ణువు - సారూప్యము క్తుడై నిరీక్షణోపాసకుడగు నందీశ్వరుని స్థానములో, శక్తి-నిరంతర సామీప్యముక్తి నొంది సాహచర్యోపాసకురాలగు పార్వతీదేవి స్థానమందును భావింపఁదగుచున్నారు. అస్తు.

వస్తుతః — శ్రీకంఠ శివాచార్యప్రోక్త శైవ సిద్ధాంత మందు నుపాసనాకాలములో శివజీవైక్యానుసంధానమే కర్తవ్యముగా నిర్దేశింపబడియున్నది గావున నిచట శ్రీకంఠశంకరుల కైకకంఠ్య మేర్పడినదనియు వీరిరువురు-భక్త్యుపాసనాది విధానముల నొకేరీతిగా బోధించిరనియు భావించవచ్చును. ద్వైతము ననుసరించి శైవములో నొక సిద్ధాంతము విస్పష్టముగా లేకున్నను భక్తులనేకులు - జీవభావముతోనే శంకరు నారాధించి ముక్తులైన కథలు ఎన్నియో గానవగుచున్నవి. సానంద మార్కండేయాదులు-ద్వైతముక్తులని చెప్పవచ్చును. సారూప్యాది ముక్తిత్రయము ద్వైతమునే బోధించుచున్నయది. శివాద్వైతములో ద్వైతముక్తి సగుణమనియు, అద్వైత ముక్తి - "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అని చెప్పబడినట్లు సాయుజ్యరూపమై నిర్గుణమనియు ఐకదేశికముగా ముక్తిద్వైవిధ్యము నంగీకరించవచ్చును. రెండును పునరావృత్తిరహితములైనను ద్వైతము విలంబముగా శివానందప్రదమగునట్టిది.

వామదేవాదులు—"అహం మనురభవం సూర్యశ్చ" అను సార్వాత్మ్యశివభావముతో నిర్గుణముక్తి నొందియున్నవారు. "శ్రీకంఠోక్త శివాగమాది విధినా-పంచాక్షరీ దీక్షితః।
లింగాంగీ నిజవర్ణధర్మసహితః - షట్కాలపూజాపరః ।
భస్మాద్యాచరణాష్టకాదినిరతః - శ్రీకంఠ సిద్ధాంతభాక్ ।
వైరాగ్యాదిచతుష్టయాన్వితమనాః-శంభుంభజేచ్చాశ్వతమ్"
అనురీతిగా శివోపాసకులగువారును ప్రారబ్ధాంతమున శివానుగ్రహసాధ్యమగు సాయుజ్యముక్తిం బొందుట కర్హులగు

చున్నారు. వైకుంఠాధీశ్వరుడగు నారాయణుడు - శివోఽహం భావన కలవాడగుటంజేసి ఉపాసకాగ్రణియనియు, పురుషోత్తముడనియు, "తత్త్వం నారాయణః పరః" అనియు శ్రుతి వర్ణించుచున్నయది. శ్రీకృష్ణుడును అట్టి యభేదోపాసకుడై మున్నుతా బదరికాశ్రమములో వసిష్ఠాది మహర్షులతో సహ వినియున్న గీతలనే అర్జునునకు బోధించి విశ్వరూపము ను ప్రదర్శింపజేసియు "మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ" అని భగవద్భావమును విశదపరచెను. దధీచి దుర్వాసః ప్రభృతులు నిట్టివారే;

ఇట్లు సామరస్యము శాస్త్రీయముగా ఏర్పడియున్నను పరాత్పరత్వవిషయమై పరస్పరము వాదించుకొనువారు లేక పోలేదు. ఈ పారమ్యసామరస్యము కొంతవర కిట పరిశీలింపబడుచున్నయది.

ఎవరు ఏ దేవతయొక్క పరత్వమును నిరూపింప ప్రయత్నించినను వేదమూలముగానే యని తెలియదగును. భగవత్తత్త్వము ప్రత్యక్షసాధ్యము కానిదగుటంజేసి భక్తులు గూడ పరమాత్మను నిర్దేశించి చూపుటకు వేదశాస్త్ర పురాణేతిహాసాదులను సాధనములుగా గ్రహించిరి. పరిప్రథమా విఖ్యాతమగుటను పురాణేతిహాసాదులకన్న వేదమే ముఖ్య ప్రమాణమని ప్రధానులైన పెద్దల యాశయము. ఇందేక దేశ ప్రమాణములకంటె సార్వత్రికములు స్వార్థంబులును బలవత్తరములగుచున్నవి.

"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం – బహ్వీంప్రజాం జనయంతీం సరూపాం"

ఎరుపు తెలుపు నలుపు రంగులు నుపలక్షణములుగా కలిగియున్న రజస్సత్త్వతమోగుణములచే నిండియుండు నిత్యురాలైన మాయ –తనతో సమానమైన అనేక ప్రజలను సృష్టించుచున్నది. ఇత్యాద్యర్థములుగల శ్రుతివాక్యముల ఆధారముగా శక్తియే తత్త్వమని కొందరు నిర్వచించినారు. ఇద్దాని సమర్థించుచు మరియొక శ్రుతి. వాక్యము – "మాయాంతు ప్రకృతిం విద్యా – న్మాయినంతు మహేశ్వరం" స్వాపృథక్ సిద్ధమహేశ్వర వతియగు శక్తి నుపాదానముగా, స్వాభిన్న మాయ కలవాడగు మహేశ్వరుని నిమిత్తముగాను విశద పరచుచున్నయది.

"తస్యావయవభూతేన – వ్యాప్తం సర్వమిదం జగత్" మాయావిశిష్టుడైన మహేశ్వరుని అంశభూతుడగు నారాయణునిచే – పరిదృశ్యమానంబగు జగంబంతయు వ్యాపింపఁబడినది కావుననే విష్ణువను సార్థకనామధేయుడై "నారాయణా ద్బ్రహ్మాజాయతే– నారాయణాద్రుద్రోజాయతే" అని పరాత్పరుడుగా వర్ణింపఁబడుచు జ్ఞానులచే తత్త్వవేత్తగా భావింపబడుచున్నాడు. నారాయణునకు నిర్గుణత్వము సుప్రసిద్ధము గాకుండుటఁజేసి సగుణమూర్తిగా సర్వత్ర పేర్కొనబడెను.

కరచరణాద్యవయవములు ప్రాకృతగుణములును కలిగి యుండుట సగుణత్వమనియు, సత్యసంకల్పత్వాద్యప్రాకృత గుణములును కలిగియుండుట సగుణత్వమనియు, సత్యసంకల్ప

త్వాద్యప్రాకృతగుణములు. మనోవాచామగోచరమగు దివ్య జ్యోతిర్లింగత్వము, సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహము లనెడి పంచకృత్యముల కేకైక కర్తృకత్వంబును కలిగియుండుట - నిర్గుణత్వమనియు ప్రాచీనుల యభిప్రాయమై యున్నది.

సకళత్వ నిష్కళత్వోభయములు విష్ణ్వాదులకు లేవు కావుననే ముముక్షువులు పెక్కురు సదాశివునే ఆరాధించి "శివోఽహం" భావన చేయుచున్నారు. ఇట్టి సగుణమూర్తియైన నారాయణుని బ్రహ్మాదులకన్న నతీతునిగా వైదికప్రక్రియతో పూజించి కామితములంబడయు విధానము సర్వులచే నంగీకరింపబడియున్నది.

బ్రహ్మాండశరీరుడైన పరమాత్మ యవయవములగు సూర్యచంద్రాదులలోనొక్కొక్కరి నుపాసించుట మోక్షప్రదము గాకుండునట్లు సమిష్టి స్వరూపమగు సదాశివుని యంశభూతులైన శక్తి విష్ణ్వాదులను వేరువేరుగా పరాత్మభావనతో నారాధించుట నిఃశ్రేయస్కరము కాజాలదు. ప్రమాణ సంపత్తితో ఒకరికన్న నొకరిని యెక్కువగా భావించుచు సదాశివుడే పరాత్పరుడని ధ్యానించుట యుత్తమోత్తమ మగుచున్నది.

"సూర్యఆత్మా జగతస్తుషశ్చ" చరాచర జగమునకంతటికి ఆత్మయని సూర్యుడు పేర్కొనఁబడుచున్నాడు. వరేణ్యమగు తేజస్సుగల సూర్యస్వరూపము ప్రత్యక్షమగుటచే ముఖ్యముగా ముముక్షూపాస్యమని కొందరు నిర్ణయించుకొనిరి. యోగాదులచేతను సాక్షాత్కరించుకొన శక్యముగాని

పరమాత్మ - సూర్యాదులవలె నప్రయత్నముగా గోచరించి నచో ఉపాసనకు సార్థక్యము లేకుండును. "నతత్ర సూర్యో భాతి - నచంద్రతారకం" అను శ్రుతివాక్యము - ప్రళయావస్థానమున సూర్యాదులు - సూక్ష్మరూపులై యుందురనియు, సృష్టిసమయములో పరమేశ్వరుని వికాసము వలననే సూర్య చంద్రాదిక మంతయు ప్రకాశించుచుండుననియు శివైకనిత్య స్థితిని వివరించినది. ఉపాసనాస్థానములలో సూర్యమండలముగూడ చేరియుండుటచే భూతాగ్న్యతీతమగు సూర్యతేజస్సునందు సూర్యాతీతప్రతిభగల సదాశివుని ధ్యానించి తరించవలెనని పూర్వాచార్య శ్రేష్ఠులు గాయత్రీ మంత్రార్థ నిర్వచనాదులతో విశదపరచిరి.

జితేంద్రియులై భగవంతు నుపాసించువారు - ఆత్మశబ్దవాచ్యులనియు కేవల కర్మిష్ఠులగువారు - జీవాత్మలనియు వివేకము నారాయణ సూర్యాదులు పరమాత్మకు సన్నిహితులగుటఁజేసి బహుస్థలములందు నిరుపాధిక అంతరాత్మలుగా వర్ణింపఁబడుచున్నారు. దేహేంద్రియాది విశిష్టుడైన ఆత్మ - జీవ (పశు) భావమును విడిచి ఈశ్వరు (పశుపతి) ని గురూపదిష్టమార్గముగా నుపాసించి శివుడు కావచ్చును. ఉమాసహాయుడు, ప్రభువు, త్రిలోచన నీలకంఠాది విశేషణ విశిష్టుడు నగు పరమేశ్వరుని భూతయోనిగాను సమస్త సాక్షిగాను తమోతీతునిగాను ధ్యానించి యా సదాశివునే పొందుచున్నాడని శ్రుతి వక్కాణించుటచే వ్యాససూత్రనిర్దిష్టమగు ముక్తప్రాప్యత్వము - శక్తి విష్ణు సూర్యకుమార గణపతి సమిష్టి భూతుడగు పరశివునకే చెందుచున్నయది.

కుమార గణపతు లిరువురును పరమేశ్వరుని కుమారు లగుటచే "ఆత్మా వై పుత్రనామాసి" అనురీతిగా పరాత్ప రులుగా పూజింపబడు చున్నారు.

సృష్టి స్థితిలయ తిరోధానానుగ్రహము లైదిటికిని సర్వాతీతమగు ఆనందమునకును ఆశ్రయములుగా ఆరుముఖ ములు కలిగి ఓంకారవాచ్యుడను నేనే యను భావమును వెలిబుచ్చిన కుమారుడు - తండ్రివలె సత్కరింపబడుట యొక వింతకాదు. సుబ్రహ్మణ్యుడనగా- బాగుగా బ్రహ్మను గుర్తె రిగిన వాడని యర్థము. బ్రహ్మవేత్త బ్రహ్మగానే భావింప దగినవాడు, పంచకోశాతీతము పంచమ - కోశాధిష్ఠితము నగు పరమాత్మ - అకార ఉకార మకార బిందు నాదాతీత ముగా సంఖ్యాషట్క - నిర్దిష్టుడై కామ వినాశకరమగు దివ్య రూపమునకు ప్రతినిధిగా కుమారుడగుట సర్వథా సిద్ధమై యున్నది.

ఇట్టి కుమారుని ధ్యానించు వారికిని శివత్వమే ప్రాప్య మగుటంజేసి హృదయ పుండరీకమునందు సాక్షాత్సదాశివునే భావించి ముక్తులగుట కడుంగడు శ్రేష్ఠమగును. దుర్వాసో మార్కండేయ గౌతమ దధీచి బోధాయనాదులు సర్వదేవతా సార్వభౌముడైన మహాదేవునే బాహ్యాభ్యంతరములందు పూజించి శివానుగ్రహ పాత్రులైనారు.

"యదా చర్మవదాకాశం - వేష్టయిష్యాంతి మానవాః
తదా శివ మవిజ్ఞాయ - దుఃఖస్యాంతో భవిష్యతి"

మనుష్య దేవదానవాదులు-ఆకాశమును చర్మమువలె చుట్టజాలుదురేని శివోపాసన లేకుండా దుఃఖనిర్ముక్తులు కాజాలుదురనియు "జ్ఞాత్వా శివం శాంతి మత్యంతమేతి" శివుని తెలుసుకొని మిక్కిలి శాంతిని పొందుచున్నాడనియు "బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాస్తే సంప్రసూయంతే నకారణం కారణానాం" త్రిమూర్త్యాది జనకుడు కారణ కారణుడైన పరమాత్మకు నెద్దియు కారణములేదు. గావున సర్వైశ్వర్య సంపన్నుడగు శంకరుని హృదయాకాశ మధ్యమందు సంభావించవలెననియు ఇత్యాది పరః శతప్రమాణములు శివోపాసనైకత్వమునే ఘంటాఘోషముగా ప్రదర్శించుచున్నవి.

తారకాసురాది దుష్టసంహారము - అవతారమూర్తియైన కుమారుని లక్షణమువలె "అత్తా చరాచరగ్రహణాత్" చరాచర ప్రపంచము నంతయు మహాప్రళయములో భక్షించి "శివఏవ కేవలః" నామరూప విభాగము చేయజాలని సూక్ష్మములైన చిదచిత్తులతో కూడియుండు పరమాత్మకు సర్వసంహర్తృత్వంబును ఒక లక్షణమని వ్యాసుడు నిర్దేశించెను.

ఆదిశంకరాచార్యులవారును వైదికములైన అనేక సగుణమతములను నిరూపించినను "చిదానందరూపః -శివోఽహం శివోఽహం" అని నిర్గుణసగుణమగు శివభావననే ముముక్షూపయుక్తముగా నిర్ధారించి యున్నవారు.

శివోపాసన ప్రతిబంధములను దూరమొనర్చు విఘ్నేశ్వరుని ఉపాసకగణముల కధిపతిగా భావించి పూజించుట గర్హ్యము కాజాలదు. తన ముందుకు వచ్చు ప్రాణిజాలమును

తొండముతో పారద్రోలు గజమువలె భక్తుల సంకటము లను పటాపంచలు చేయజాలు వినాయకుని పరాత్మగా నారాధించువారు కొందరు లేక పోలేదు. విఘ్నేశ్వరుడు నారాయణునివలె సర్వులచే పూజనీయుడగుట "నాకన్న నధికులు నా భక్తవరులు" అను తెలుగు నుడికారమును తదితర పురాణ గాథలను సార్థకముల జేయుచున్నది. "బ్రహ్మణాం బ్రహ్మణస్పతిం" చతుర్ముఖాది బ్రహ్మలకు వేదమునకును అధిపతియైన ఏకదంతునియందు చేయు శివోపాసన కన్న శక్తిమయమగు దహరమునందు భావింపబడు శివజ్ఞానమే ముఖ్యమగుచున్నయది.

పరతత్త్వములో శక్త్యంశముకన్న శివాంశ మధికము గావున శాక్తేయమునకు నుపసర్జనీభావమే వచ్చుచున్నది. "తౌ బ్రహ్మ సామరస్యేన" తచ్ఛబ్ద ప్రకృతి ప్రత్యయోదితులగు శక్తిశివులసామరస్యమే బ్రహ్మ యనబడును. శక్తివిశిష్టుడైన శివుడే జగన్నిమిత్తోపాదానోభయ కారణు డగుచున్నాడు. సదాశివుని ఆనంద, సంకల్ప, సృష్టి, లీలా, శరీరములే శక్తియనియు ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు కలవాడు. సర్వజ్ఞతాది సంపన్నుడు, సర్వాంతర్యామియు, సర్వమంగళాపతియు, మనోవాగ్విపర్యాసము లేనట్టి సంపూర్ణాకారము కలవాడును ఊర్ధ్వరేతస్కుడు, విరూపాక్షుడు విశ్వరూపుడు కృష్ణపింగళుడు నగువాడు శివుడనియు తెలియదగును.

ఇట్టి శివుని తెలుసుకొనుటకు యత్నించు ఉపాసకులలో వైదికులనియు అవైదికులనియు విభాగము కలదు.

వైదికులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు కర్మతోఁగూడిన భగవదుపాసనయే లక్షణము. అవైదికులు భక్తితోఁ కేవలోపాసనను చేయవచ్చును. (వేదమునకు ఋషి సమ్మతమైన పురాణోపబృంహితార్థమును నిర్ణయించుకొనుచు స్వకులాచారానుకూలముగా ప్రవర్తించువారు ప్రాయశః వైదికులని చెప్పఁబడుదురు.) అవైదికోపాసన కన్న వైదికోపాసనయే శీఘ్రము ఫలించునట్టిది. ఇట్టి వైదికోపాసనలోఁ గూడ కేవల పంచాక్షరీ - భస్మరుద్రాక్షాది గ్రహణము కంటెను తదితరముల కంటెను శివలింగధారణ దీక్షయే శ్రేష్ఠమనియు తత్పూర్వకముగానే శివోపాసనఁ జేయవలెననియు గౌతమాది మహర్షుల యాచరణచేతను శ్రీ నీలకంఠ హరదత్త మల్లికార్జున పండితాది ప్రముఖుల ప్రచారము వలనను ధృవపడుచున్నయది. (వేదము ప్రమాణమని చాటుచు అద్దాని కపార్థము జేయువారును అవైదికులని చెప్పనగును.) హిందూమాత్రుడు వేదసన్నిహితాచారము లేకున్నను తత్సంబంధము గల పురాణాది ప్రతిపాదిత మగు నడత నైనను కలిగియుండవలెను. వేద పురాణాదులను పూర్తిగా విశ్వసించనివాడు నాస్తికుడనఁ బరగుచున్నాడు.

ఇతిహాసముల నంగీకరించుచు పురాణార్థమును సామరస్యముతోఁ గ్రహించి సదాశివ పరత్వమును సంభావించుచు ఉపాసకులగువారు సంపూర్ణ వైదికులలోఁ అగ్రగణ్యులని చెప్పవచ్చును. గర్భాధానాది శ్మశానాంతము చేయబడు సంస్కారములు - స్మృతిసూత్ర సమ్మతములై వైదికములగుచున్నవి. ఇందు అంత్యసంస్కారము - శైవులకు సమాధి

రూపముగా శాంభవగృహ్యసూత్రముల ననుసరించి కర్తవ్య మగుచున్నది. కేవలస్మృతిప్రమాణవాదులు కొందరు-ఇయ్యది దహన పిండప్రదానాదిరూపము కానిచో దూషితమని సంశయించుచుందురు. లింగధారికి, జ్ఞానికి, యోగికిని దహనము కూడదని శివాగమములు, శివపురాణ, మహాభారతాదులును విశదపరచుచున్నయవి. దహన సమాధులలో దహనము సర్వప్రాప్తముకాగా విశేషించి సమాధి విధింపబడుచున్నది. శైవులకు సమాధివిహితమై మృతాశౌచము సాపిండ్యనిదానమై ఆచరణలో నున్నయది. గురుప్రదత్తమైన స్వేష్టలింగమే పరమ ధ్యేయమై భుక్తిముక్తిప్రదమని భావించువారైనను తత్తన్నిమిత్తముగా తత్తత్ప్రదేశములందు శివేతరదేవతలను పై సామరస్యభావనతో పూజించుచుందురు. మరియు భస్మరుద్రాక్షాదులు ముఖ్యలాంఛనములుగా శివపంచాక్షరీజపము భోగమోక్షైకసాధనముగా సంధ్యావందన తర్పణ బ్రహ్మయజ్ఞాది నిత్యకర్మలు, శ్రాద్ధపక్షాది నైమిత్తికంబులును విహితములుగా నొప్పారుచున్నవి.

వైదికులలో శైవ స్మార్త రామానుజీయ మాధ్వాదులు - పంక్తిభోజనము, వివాహసంబంధాములున్న పరస్పరము తతస్తతః జరుపుకొనుచున్నను మతవిషయకమగు అసహనము కలిగియే యుందురు. వీరందరికిని సామరస్యముం జూపు మతము ఏకైకమైనచో బాగుండెడిది. చాలావరకు శాంకరాద్వైతము సామరస్యమును చేకూర్చునట్టిదే కాని అందు సర్వము మిథ్య యగుటచే సగుణోపాసనాదులు విశ్వసనీయములగుట లేదు.

సగుణత్వాదులను వేదశాస్త్రములను సత్యములుగా నిరూపించుచు నిర్గుణ సామంజస్యమును చూపునదై ఉపాసనయే జ్ఞానరూపమని - ఆచరణయందు విశేషాద్వైతమును భావనలో కేవలాద్వైతమును ప్రతిపాదించుచున్న శివాగమోక్త శ్రీకంఠీయ శ్రౌతశైవమే సరళముగా సామరస్యమును ప్రదర్శించునట్టిదని గ్రహింపవలసియున్నది.

వర్ణాశ్రమాచారాది సంపన్నమగు శ్రౌతశైవములో గణప్రార్థనయందు విఘ్నేశ్వరకుమారులు, యోగాచార్య స్మరణయందు నారాయణబ్రహ్మాదులు, లింగనిరీక్షణమునందు పంచాక్షర్యర్థసంభావనయందును శివావినాభావముగల శక్తియు దీపారాధనమున సూర్యాదులును, ధ్యానమునందు శివోఽహం భావనయు వచ్చుచుండుటచే సర్వసామరస్యము సుసిద్ధమైయున్నదని భావింపక తప్పదు.

అనగా ఇతర మతములలో సామరస్యము మృగ్యమని చెప్పుటకాదు. లాంఛనములుదక్క వైదికమగు భగవద్ధారణమెందును లేనందునను సర్వాలవాలమగు శివలింగమును వామహస్తమునందు పూజించుచు సర్వమునందును స్వేష్టలింగమే యున్నట్లు ధ్యానించి సర్వదేవతా సన్మానముతో శివు నుపాసించు శైవుడు మోక్షపథము ననుసరించు విధానమున్నందునను సామరస్యనిదాన మిదియే యగుచున్నది.

సంధ్యావందన పూజా జప శ్రాద్ధాదులు మాత్రము తప్పనిసరిగా ఆచరింపబడుటచే వైదికత్వము పూర్వోక్తమతములవారికి పరిపుష్టమనియే నిర్ణయించుకొనవచ్చును. ఇట్టి

వైదికములలో శైవమే సర్వసామ్యముగల దగుటచే సర్వోపాదేయ మగుచున్నయది. శ్రీ నీలకంఠ శివాచార్యులవారిచే సూత్రభాష్యమునందు ఉపాసనలలో శ్రేష్ఠముగా నిర్ధారింపబడిన దహరమునకు లింగాంగసాహిత్యముగల శివోపాసనయే సన్నిహిత మగుచున్నది.

కావున నీ వైదికమత సామరస్యమును బాగుగా పరిశీలించి సరసులగువారు సిద్ధా[illegible] ధారణ కలవారగుదురనియు శ్రౌతశైవులు తమ మతసార్వాత్మ్యము సందుమూలముగా గ్రహించి తెలుపుచుందురనియు విశ్వసించుచు యథాశక్తి వ్రాసితిని. అపోహలకు, కువిమర్శలకు బాధ్యుడనుకాను. ప్రతి సముల్లేఖమునందును శివప్రీతియే మా ప్రధాన లక్ష్యము. ఇదమిత్థమని గట్టిగా నొక్కిచెప్పు ప్రమాణముల అర్థము ననుసరించి శివప్రేరితమైన గురుసమ్మతమగు విజ్ఞానము దీనికాధారము.

పరమేశ్వరు డేనాటికైన నీ వైదికమత సామరస్యమును సఫల మొనర్చుగాత యని విధేయతాపురస్సరముగా యథార్థవచనధీరమగు హృదయముగల నిర్మలశంకరుడు ఈ గ్రంథమును విరమించుచున్నాడు.

---

# వైదికమత సామరస్యములోని
# శుభాభినందనము

| తప్పు | ఒప్పు | పేజి | పంక్తి |
|---|---|---|---|
| శ్రీ గొను | శ్రీ గోను | ౯ | ౧ |
| ఛక్షు | చక్షు | ౯ | ౨౦ |

## సామరస్యము

| | | | |
|---|---|---|---|
| దుర్వాసః | దూర్వాసః | ౯ | ౭ |
| సర్వదా | సర్వథా | ౧౩ | ౧౩ |
| బాహ్యాభ్యంత | బాహ్యాభ్యంతర | ౧౩ | ౧౯ |
| ఆకార | ఆకాశ | ౧౪ | ౧ |
| పాదావో | పాదానో | ౧౫ | ౧౫ |
| హ్మణ | బ్రాహ్మణ | ౧౬ | ౧ |

౧౦యవ. పేజీలో

"కరచరణాద్యవయవములు ప్రాకృతగుణములును లేకుండుట నిర్గుణత్వమనియు, సత్యసంకల్ప" అని చదువవలెను.

అధిక ముద్రితము

"కలిగియుండుట సుగుణత్వమనియు, సత్యసంకల్పత్వా ద్యప్రాకృతగుణములును కలిగియుండుట సగుణత్వమనియు"

౧౧ వ పేజీలో నాలుగవ పంక్తి

"నిర్గుణత్వమనియు" అనుచో "సగుణత్వమనియు" అని చదువవలెను.

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః.

# శ్రీ నీలకంఠ శివాచార్యులవారు

# శివాద్వైతము

శ్రీకంఠీయ గ్రంథమాల - ద్వితీయ బిల్వము



ఇయ్యది

శ్రుతిసూత్రార్థము ననుసరించి సంగ్రహముగా

శ్రీ పండిత, నిర్మల శంకరశాస్త్రిగారిచే వ్రాయబడి

ప్రాణలింగమున కంకితముగా ప్రచురింపఁబడెను.

ప్రతులు 500

విజయ వైశాఖము

శ్రీ శివాభ్యాన్నమః.

# శ్రీ శివాద్వైత సిద్ధాంత రత్న పంచకము

శ్లో॥ శ్రీమచ్ఛైవమతే శివః పరతమో జీవప్రపంచౌ స్థితౌ
చైతన్యాదిగుణైః శివేన సమతామాప్నోతి జీవః కిల ।
బద్ధో శంభుసమిచ్ఛయాఽద్య పశుతాం ప్రాప్తః పుమాన్ సంసర
త్యార్తః సన్ తదనుగ్రహాచ్ఛివసమో భక్త్యా చ ముక్తో భవేత్॥

శ్లో॥ విశ్వాతీత మమేయ మాద్యమమలం విశ్వాత్మకం కారణం
కార్యంచోభయమేకమేవ, శివశక్త్యోః సామరస్యం జగత్।
ముక్తిః శాశ్వతనైజలాభవిషయా సృష్ట్యాదివ్యాపారతః
శూన్యాఽనందమయాచ, శంభుపదవీవిశ్వోత్తరావర్తతే॥

శ్లో॥ ఆనందప్రచురః పరాత్పరతనుశ్చిచ్ఛక్తియుక్తో విభుః
సూర్యాకాశవదేష దోషరహితః కైలాసవాసీ ప్రభుః।
భక్తోద్ధారపరో విచిత్రగతికః కారుణ్యసింధుః శివః
సృష్ట్యాదికృతిపంచకం వితనుతే లీలార్థ మేవాభయమ్॥

శ్లో॥ శ్రీకంఠోక్త శివాగమాదివిధినా పంచాక్షరీదీక్షితః
లింగాంగీ నిజవర్ణధర్మసహితః షట్కాలపూజాపరః ।
భస్మాద్యావరణాష్టకాది నిరతః శ్రీకంఠసిద్ధాంతభాక్
వైరాగ్యాది చతుష్టయాన్వితమనాః శంభుం భజేచ్ఛాశ్వతమ్॥

శ్లో॥ విద్యాకర్మసమాశ్రితా శివపదం ప్రాప్యం ముముక్షోః పరం
బ్రహ్మానంతగుణాన్వితం హరిపరం తృష్ణాదిహీనం మహత్।
వేదాద్యాగమకర్తృసామ్యమభవస్యైవోదితం శంకరా
త్కర్తుః కర్మఫలత్వాహో బుధజనాః! శైవం సమాకర్ణ్యతామ్॥

ఓం నమః శివాయ

# పండితాభిప్రాయము

ఈ శివాద్వైత గ్రంథమందు శ్రీకంఠ శివాచార్య ప్రతిపాదిత విశిష్టాద్వైతము చక్కగా వివరింపబడినది. శంకర రామానుజాది భాష్యకర్తలకంటె పూర్వమే శ్రీ నీలకంఠీయ భాష్యము రచింపబడి ప్రమాణపదవి నధిష్ఠింపఁజేయబడినదని శ్రీమదప్పయదీక్షితేంద్ర, హాలాస్యనాథాది ప్రాచీనపండితులు ముక్తకంఠముగా నిర్ధారించినారు. మరియు శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ ఆచార్యులవారిచే అర్వాచీన భాష్యకర్తల కసాధ్యములగు స్వకీయ పాండిత్య ప్రతిభలతో సూత్రార్థ సమన్వయము శ్రీ వేదవ్యాసుని హృదాశయమున కవిరుద్ధముగా గావింపబడినదని శ్రీకంఠవిద్యాభూషణ, పండిత, నిర్మల శంకర శాస్త్రిగారి శివాద్వైత గ్రంథమువలన విశదమగుచున్నయది.

ప్రమితాధికరణమునందు "శబ్దాదేవ ప్రమితః" అను సూత్రమును వివరించుచు "ఈశానో భూతభవ్యస్య" అను శ్రుతివాక్యము నందలి ఈశానశబ్దమువలననే ప్రమితః పరమాత్మా అనియు, ఏవకారముచే శ్రుతికంటె లింగాదులు దుర్బలములనియు, కొందరిచటి ఈశానశబ్దమును మీమాంసా విరుద్ధముగా గ్రహించి స్వమతపరమైన విస్తారమును ప్రతిపాదించిరనియు ఈశానశబ్దము శ్రుతినిఘంటురూఢ్యాది కారణములవలన శివైకవాచకమని శ్రీ నీలకంఠ శివాచార్యులవారు నిరూపించిన యంశము ఇందు సుగమము.

కార్యాధికరణమునందు "కార్యం బాదరి" అను పూర్వపక్ష సూత్రమును సిద్ధాంతముగాను "పరం జైమిని ర్ముఖ్యత్వాత్" అను సిద్ధాంతసూత్రమును పూర్వపక్షముగాను నిరూపించి తమ మతప్రతికూలత బ్రహ్మసూత్రములలో

కుత్రాపి లేకుండా కథమపి స్వసిద్ధాంత నిర్ణయముచేయ బహు ప్రయాసపడిరి మరికొందరని ఏతద్గ్రంథపాఠకులు గ్రహింత్రు గాత !

శైవ వైష్ణవాది మతములన్నిటియందును ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములు విభిన్న కాలములలో ప్రతి యుపాసకునికి నవశ్య సంభావనీయములగుచున్నవి. ఇత్యాది విశేషములు శివాద్వైతములని చదువరులు తెలుసుకొనవలెను.

ఈ మొత్తము గ్రంథము ప్రామాణికమని వేరుగా చెప్పనవసరములేదు. గ్రంథకర్తగారున్ను సుప్రసిద్ధ పాండిత్య యోగ్యతాదులు కలవారగుటచే ప్రత్యేకించి యధికముగా నివేదించకుంటిని.

తథాపి ఇందు యుక్తియుక్తములు సుసమంజసములునైన యంశములను పొందుపరచుచున్నాను.

ముక్తజీవుల గమ్యస్థానమును నిరూపించు భాగము.

పరమేశ్వరునకు గల అభిన్న నిమిత్తోపాదాన కారణత్వమును సమర్థించుటయు, బ్రహ్మేశాన శబ్దములు సమానార్థకములని చెప్పు నంశము, శ్రీ నీలకంఠ శివాచార్యులవారు- లింగధారిబ్రాహ్మణులని తెలుపు ప్రకరణంబును శైవేతర మతస్థులకుగూడ నుపాదేయములనియు, శైవులలో పండితులను రంజింప పామరుల నుద్ధరింపబూనిన శ్రీశాస్త్రిగారి గ్రంథ సముల్లేఖనపూర్వక ప్రచురణ యత్నము కడుంగడు శ్లాఘనీయమై శైవబాలురకు ఆదర్శప్రాయమగుననియు విశ్వసించుచున్నాము.

ఇట్లు,

న్యాయవేదాంతాయుర్వేదాభిజ్ఞ, మూలంపల్లి రాజశేఖర శాస్త్రి,

8—5—53 ప్రభృతి శైవపండిత బృందము, హైదరాబాద్.

# శివాద్వైత సిద్ధాంతము

నిజశక్తిభిత్తినిర్మిత-నిఖిలజగజ్జాల చిత్రనికురుంబః ।
జయతి శివః పరమాత్మా-సకలాగమసారసర్వస్వమ్ ॥

శ్రీమదార్యావర్తంబునఁ గల ఆర్యమతములలో నగ్రగణ్యమై శుద్ధసనాతనమనఁదగు శైవమతమును కృతాది యుగములందు శ్వేతాచార్య ప్రభృతులు వ్యాపింపఁజేసియున్నవారు. ఆ కాలములో బ్రహ్మసూత్రములయొక్కయు, గీతలయొక్కయు ఆవిర్భావము గాకుండుటఁజేసి యుపనిషద్వాక్యార్థములే పరమప్రమాణములై సంతృప్తిఁ గలిగించుచుండెడివి. రానురాను నానార్థము లనేకులచే విస్తరింపఁ జేయఁబడుచున్నందున నిర్ణయములేమి భగవానుడగు వేదవ్యాసుడు వేదాంతముల సామరస్యముఁ జూపెడి బ్రహ్మసూత్రముల రచింపవలసిన యవసర మేర్పడెను.

దాదాపు ఐదువందలకు పైగా సంఖ్యగల నీ సూత్రములకుగల వ్యాసహృదయమును గుర్తెరిగి వ్రాయుటకు మహానుభావులైన సమర్థులు కావలసియుండెను. కలియుగాదిలో విష్ణువు బుద్ధరూపమున ప్రచారముగావించిన నాస్తికమతమును ఖండించుటకై తానశక్తుడగుటవలన శ్రీ పార్వతీనాథుడు, శ్రీకంఠ శంకరపండితాది స్వరూపములఁ దాల్పవలసివచ్చినది.

అందు శ్రీకంఠ శివాచార్యులవారు కాళేశ్వరమనఁబడు శివక్షేత్రమునం దవతరించి కృతోపనయన సంస్కారులై నిఖిల వేదవేదాంగముల నభ్యసించియు దైవవశమున తటస్థపడి

యుండు శ్వేతాచార్యులవారియొద్ద వేదాంతోపదేశముం బడసి యున్నవారు.

మరియు వీరు,

తంజాపూరు జిల్లాలోని కంసపురగ్రామమందు శ్రీవైష్ణవ కుటుంబమున జన్మించియు పిన్ననాటనుండి శివభక్తి కలిగి యుండుటచే మండుచున్న ఇనుపపీటమీద కూర్చుని “శ్రీ శివుడే సర్వాధికుఁడని” పంచరత్నములతో నిరూపించి పాశుపతదీక్షితుడైన హరదత్తాచార్యులకు సమకాలికులని చెప్పవచ్చును.

శ్వేతాచార్యుఁడు పరశివుని యాదేశానుసారము భూలోకమందవతరించి శివయోగులలో నగ్రేసరుడని ప్రఖ్యాతి గాంచెను. ఈ శ్వేతుడు మొదలుకొని లకులీశుని వరకు (౧౮౦) సంఖ్యగల శివయోగులు పేర్కొనఁబడుచున్నారు. ఇట్టియోగులలో ముఖ్యులైన ఇరువదియెనమండుగురు నలుగురేసి శిష్యులుగలవారై ఒకొకయుగమునందు శివయోగప్రచారము నొనర్చియున్నారు. కథమపి వ్యాసహృదయము, ముముక్షువుల కవశ్యజ్ఞాతవ్యమైనందున శివాంశసంభూతులను శ్రీకంఠులు గురుప్రసాదలబ్ధ మహిమాతిశయముతో శివభక్తుల నుద్ధరించు యనురాగముతోఁడను వ్యాససూత్రములకు ఔపనిషదమైన ఆదిమభాష్యము నుల్లేఖింపవలసినవారైరి. తత్పూర్వము కొందరాచార్యులు వ్రాసిన వ్యాఖ్యానములతో సూత్రములు కలుషితములై యస్పష్టార్థవంతములైనందున శైవాది వైదిక మతములు సన్నగిలినవని చెప్పవచ్చును.

శ్రీ నీలకంఠ శివాచార్యులవారు గౌతమగోత్రికులైన ఆంధ్ర బ్రాహ్మణులై పదియవ శతాబ్దములో జన్మించియున్నవారు. వేదవ్యాఖ్యాత యగు భట్టభాస్కరుని సిద్ధాంతమునకు వీరి సిద్ధాంతము సరిపడుచున్నందున నీ కాలనిర్ణయము చేయ నగును. వీరు ఇష్టలింగధారులని చెప్పుటకు కొందరు వేదైక దేశప్రమాణవాదులు సంశయించుచుందురు.

"వయం తు వేదశివాగమయోర్భేదం నపశ్యామః వేదేపి శివాగమ ఇతి వ్యవహారో యుక్తః తస్య తత్కర్తృకత్వాత్"

"వేదశివాగమములకు భిన్నాభిప్రాయము నెంతమాత్రము పాటింపము. శివాగమమువలె వేదము శివకర్తృకమగుటంజేసి వేదములుగూడ శివాగమము లగుచున్నవని" తమ సూత్రభాష్యమునందు – విశేషతః లింగధారణం బలపరచు శివాగమముల నంగీకరించుటవలన వీరు లింగధారిబ్రాహ్మణులని విశ్వసించుట కెంతమాత్రము సందియ మనవసరము.

శ్రీ శంకరభగవత్పాదులవారు నీలకంఠ ప్రభృతులతో వాదించినట్లు శంకరవిజయమున కలదుగాని యభినవ నీలకంఠాదులే శంకరాచార్యులకు సమకాలికులైనట్లు చరిత్రల వలన తెలియుచున్నది. గావున శ్రీకంఠశివాచార్యులవారు పరమ ప్రాచీనులుగా ఎన్నుకొనఁబడుచున్నారు. వీరి సూత్ర భాష్యమునందు అద్వైతఖండన అధికముగా కానరానందున వీరికాలములో అద్వైతప్రచారము విరివిగా జరుగలేదనియే విశదమగుచున్నది.

సాంఖ్య బౌద్ధ జైన పాంచరాత్రాదిమతములనే ఎక్కువగా నిరాకరించియున్నవారు. వీరికి వైదికమగు ప్రతి మతమునందును ఆదరభావమున్నట్లు గోచరమయ్యెడిని.

ఉపాసనాకాలమందు జీవేశ్వరుల కభేదభావమును; జగదుపాదానమైన పరమేశ్వరుని విష్ణురూపమును వైదికముగా నారాధించుటను,

దహరోపాసనయందు హృదయపుండరీకములో గల దహరాకాశమును శక్తిమయముగా భావించుటను; అంగీకరించియున్న వీరి సామరస్యపూర్వక స్వమతనిర్ధారణను పండితులు గ్రహించెదరుగాత!

యద్యపి-"వినిర్ముక్త సకలేతర దేవతారాధనా, త్రివిధ కరణసంపాద్యా, విశిష్టాష్టాంగయోగినీ, పరమశివపరిచర్యమయీ, వైదికక్రియాభక్తిః" అని చెప్పినను విష్ణ్వాదిచేతనలందు పృథివ్యాద్యచేతనములందు దహరాకాశాదులందును భావించుట రూపముగా పరమేశ్వరోపాసనకు త్రైవిధ్యమును నిరూపించి యున్నవారు. కాని చేతనాచేతనోపాసనకన్న సాక్షాచ్ఛివోపాసనయే ముఖ్యమై యవిలంబముగా శివత్వము నాపాదింపజేయునదనియు, అద్దాని యర్హతకు మొదట శ్రీ శివాగమోక్త పాశుపతదీక్షఁ గ్రహించి యావజ్జీవము ఇష్టలింగానుసంధానమును గావింపవలెననియు, అన్యదేవతోపాసకులు అన్యలోకములందు ప్రారబ్ధాంతము నివసించి చివరకు శివోపాసకులై ముక్తులగుదురనియు, శివోపాసకులు దేహావసానమందు బ్రహ్మాండసీమ యగు విరజానదీ వైకుంఠముల

నతిక్రమించి శక్తి విష్ణుమయమైన శివపదమును ప్రవేశించి శివసదృశముగా ఆనంద మనుభవించుచు బ్రహ్మాండమును వ్యాపించియుందురనియు తత స్తతః వ్యక్తీకరించియున్నారు.

మఱియు ప్రమితాధికరణమునందు "తతః పరమేశ్వరో జ్యోతిర్మయో లింగరూపత యోపాసకానాం హృదయమధ్యే ప్రతీతి నిర్ణయః"

"జ్యోతిర్మయుడగు పరమేశ్వరుడు ఉపాసకుల హృదయమునందు లింగరూపముగా విలసిల్లుచున్నాడని" వివరించుటవలన వీరు బాహ్యాభ్యంతర శివలింగోపాసకులని విదితమగుచున్నది. సర్వథా తమకు ఆచార్యులైన యీ మహానీయుని శివాద్వైతసిద్ధాంతమును శైవమహాజను లంగీకరించి ప్రచారము జేయవలసియున్నది. విమతస్థులగు శ్రీమదప్పయదీక్షిత నీలకంఠదీక్షిత విద్యారణ్యాదులే ఆమోదించియుండ శివభక్తిపరాయణులై సర్వంబును శివమయముగానే భావించి శ్రీశివలింగమునే ఆరాధించు శైవులలో కొందరిద్దాని నభినందింపకుండుట విస్మయావహముగా నున్నయది. ఆ పరమేశ్వరుఁడగు నీలకంఠ శివాచార్యుని యనుగ్రహమున సర్వులకీ శివాద్వైతమం దభిరుచి కలుగుగాత.

# శివాద్వైతము

అమృత నామధేయుడగు శ్రీ సదాశివుని చే ప్రవర్తితంబై శ్రీకంఠ శివాచార్యులవారిచే విశేషప్రచారము నొందియున్న శివాద్వైత సిద్ధాంతము పరమప్రాచీనమై చిరస్థాయి యగు

నట్టిది. ఈ శివాద్వైతమను పదమును నిర్వచించుటకు 'విశిష్ట' యను పదమును తగిలించవలెను. "సూక్ష్మచిదచిచ్ఛక్తి విశిష్టశివశ్చ-స్థూలచిదచచ్ఛక్తి విశిష్టశివశ్చ-తయోరద్వైతం విశిష్టశివాద్వైతం" వస్తుతః శివుడు ఒకేవిధముగా నుండువా డైనను ఆతని చిచ్ఛక్తి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులుగా మారి నపుడు ద్వైవిధ్యము వచ్చుచున్నది కావున సూక్ష్మత్వస్థూలత్వ ద్వివిధయగు శక్తితో కూడియుండు దశలనిమిత్తముగా ఐక్య ప్రతిపాదనార్థమైన ద్వివిధత్వము నొందినట్లు వ్యవహరింపఁబడు చున్నాడు.

"విశిష్టంచ విశిష్టంచ విశిష్టే, తయోరద్వైతం విశిష్టా ద్వైతమ్" అని చెప్పుట సరిపడదని శివశబ్దమును గ్రహించుట లేదు. విశిష్టమనగా శివాభిధేయమగు బ్రహ్మ యగుచున్నది.

"శక్తిః శివశ్చ సచ్ఛబ్ద ప్రకృతిప్రత్యయోదితౌ ।
తౌ బ్రహ్మసామరస్యేన సమస్తజగదాత్మకౌ"

సచ్ఛబ్దమునకు ప్రకృతిశక్తి యనియు, ప్రత్యయము శివుడనియు, నిఖిలవిశ్వాత్మకులైన శక్తి శివుల సామరస్యమే బ్రహ్మ యనియు నిర్వచనము.

శక్తి శివులలో అన్యతర రహితమైనది బ్రహ్మ కాజా లదు. శక్తి - విశేషణము, శివుడు విశేష్యము నగుటఁజేసి శక్త్యతీతుడగు శివుడు శక్తివిశిష్టుడగుచున్నాడు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమునందు శివశబ్దము సంఘటితమై లేదుగదా యని కొందరు తలచు చుందురు.

"యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతిమానవాః
తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి"

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్య త్పరిత్యాజ్య"
ఇత్యాది శ్రుతి ముఖ్యములందు శివశబ్ద వాచ్యునే ఉపాస్యు
మనియు, అద్దాని సాక్షాత్కారమువల్లనే మోక్షము సంభ
వించుననియు, ముక్తుడు శివసము డగుననియు ప్రతిపాదింపఁ
బడుటచే శివబ్రహ్మ శబ్దములు పర్యాయప్రాప్తములై అన్యో
న్యార్థబోధకము లగుచున్నవని తెలియనగును.

"శబ్దాదేవ ప్రమితః" అను సూత్రముయొక్క విషయ
వాక్యమునందు ఈశానశబ్దమే యుండుటఁజేసి "జన్మాద్యస్య
యతః" అను సూత్రార్థము "ఈశానో భూతభవ్యస్య" అను
వాక్యార్థంబు నేకమౌలగుటవల్లను బ్రహ్మశబ్దము ఈశాన
పర్యాయమగు శివశబ్దముతో నేకీభవించుచున్నయది.

ఆస్తికులైన హిందూమాత్రులు వివాదగ్రస్త విష
యములకు శబ్దము (శ్రుతి) నే ప్రమాణముగా గ్రహించుచు
న్నారు. శబ్దమున కనుకూలమగు అనుమానమును గూడ
నంగీకరింతురు. కాని స్వతంత్రమైన అనుమానముమాత్రము
ప్రమాణము కాజాలదు. సర్వజ్ఞుడైన పరమేశ్వరుని జగత్క
ర్తగా నిరూపించుటకు శ్రుతియే ప్రధానసాధనము. కేవలాను
మానముచే విచిత్రప్రపంచమునకు కర్త నూహించుటకు వీలు
లేదు. ఇట్టి శబ్దము నిగమాగమరూపముగా ద్వివిధ మగు
చున్నది. శివునం దెట్టిదోషము లేనందున శివకర్తృకమగు
శబ్దమునం దసత్యత యుండఁగాదు. నిగమములను ద్విజులు
మాత్రమే పఠింప నర్హులు. ఆగమములను అన్నివర్ణములవారు

పరిగ్రహింపవచ్చును. అష్టావింశతి సంఖ్యగల ఆగమములు "శివుడే పరమేశ్వరుడు, ఆతడే యీ బ్రహ్మాండముయొక్క సృష్టిస్థితిలయములం గావించుచు జగమునకు అభిన్ననిమిత్తోపాదానకారణ మగుచున్నాడు. మరియు త్రిగుణాత్మకమైన ప్రపంచమునందు ఓతప్రోతముగ నుండియు స్వరూపతః త్రిగుణాతీతుడై సమస్తజీవుల నియంత, ప్రేరకుడు, పరమగతియు నగుచున్నాడు. వేదములు, ఉపనిషత్తులును అనిర్దేశ్యముగా ప్రదర్శించిన బ్రహ్మసత్త శివునకే చెల్లును" ఇత్యాది శివాద్వైత సిద్ధాంతమును విపులముగా నిర్ధారించుచున్నవి. ఈశ్వరునకు కేవల జగన్నిమిత్తత్వమును ప్రతిపాదించు కొన్ని ఆగమములు ప్రామాణికములైనను వాని తాత్పర్యము జగదుపాదానత్వము నందుగూడ పర్యవసించుచున్నయది.

కైవల్యము, శ్వేతాశ్వతరము, అథర్వశిఖ మొదలగు వేదాంతములన్నియు స్పష్టముగా శివుని మహిమను వర్ణించి యున్నవి. కావుననే నిగమాగమముల ప్రతిపాద్య మేకమగుచున్నది. మహానారాయణోపనిషదాది కతిపయప్రకరణములు విష్ణుపరములుగా కనబడుచున్నను ఆద్యంతముల విచారించినచో శివపరములనియే తేటపడును. ఉపాసకశ్రేష్ఠుడగు నారాయణుని హృదయపుండరీకమునందు పరశివు నుపాసింపవలసినదిగా శ్రుతి వక్కాణించుచున్నది. "నారాయణ పరం బ్రహ్మ" నారాయణునకు సోత్కృష్టముగా ధ్యేయమగునది బ్రహ్మ యనియు, అథవా నారాయణునికంటె శ్రేష్ఠమైనది శివాభిధేయమగు బ్రహ్మ యనియు, విశదార్థము. ఘటమునకు మృత్తికవలె శివుడు జగమునకుపాదానమైనను పరిణామి

కాజాలడు. వస్తుతః పరిణామము చిచ్ఛక్తికే కలుగుచున్నది. చిచ్ఛక్త్యవినాభూతుడగుటచే శివుఁ డుపాదానమగుచున్నాడు.

జీవుల కనిత్యత్వము నంగీకరించినచో కల్పాంతమునందు కర్మలవివాదము, సృష్టిలో నూతనకర్మఁ సమాగమంబును ఏర్పడును. ప్రారబ్ధముదక్క సంచితాగాముల కీశ్వరానుగ్రహమువలన వినాశ మంగీకరింపబడినను ప్రారబ్ధము గూడ నశించి యితరులకు సంక్రమించుట. అకృతము సంప్రాప్తించుటయు అను దోషములు అనివార్యములగుచున్నవి. జీవులు నిత్యులు, చేతనులు. గావున వారు చేయు కర్మలు గూడ ఆమోక్షము ప్రవర్తించునవిగానే యుండును. కర్మప్రవృత్తులైన జీవుల యంతఃకరణముల మాలిన్యమును భోగముతో నంతరింపఁజేయుటయే సృష్టిలోని రహస్యము. జగత్తు అసారమైనను సారవంతముగ నగుపడుటయే (అజ్ఞులైన జీవుల) కర్మప్రవృత్తికి కారణము. భగవానుడు జీవుల నిజస్వరూపమును మరుగుపఱచుట తిరోధానమనఁబడును. తగు సాధనసంపత్తితో సిద్ధులై యుండు జీవులను దయతో భవబంధమునుండి ముక్తులఁ గావించుట అనుగ్రహ మనఁబడును. కరుణామయుడగు పరమేశ్వరుడు రుద్రుడై జగమును సంహరించుట జననమరణాది సంసారప్రవాహములో కొట్టుకొనిపోవుచు పరిశ్రాంతులైన జీవులకు విశ్రాంతి నిచ్చునదగుటఁజేసి కృపాపూర్ణమగుచున్నది. "రుత్ దుఃఖం, ద్రావయతీతి రుద్రః"

శక్తి లేనిది శివునకు సర్వజ్ఞతాదిశబ్దములు సార్థకములు కాజాలవు. శివుడులేనిది శక్తి యుండజాలదు. స్థూలత్వమును

తొలగించుటయే ప్రళయమనియు సూక్ష్మములుగా నుండు జీవప్రపంచములను పెంపొందించుటయే సృష్టి యనియు, వివేకము; జీవులు సర్వథా శివునితో అభిన్నులు, భిన్నులునుకారు. అధికారులగుజీవులు వేదాగమములను పరిశీలించుచు వాని తత్త్వములను స్మరించుచు అన్యతమోపాసనతో బ్రహ్మ సాక్షాత్కారముం బడయుదురు. సాక్షాత్కృతశివులు స్థూల ప్రపంచమును గూడ శివరూపముగా నవలోకించుచు ఆనందార్ణవ నిమగ్నులగుచుందురు.

జీవుఁడు బద్ధదశయందణువుగా ముక్తదశయందు విభువుగా నై అపహతపాప్మత్వాది గుణయుక్తు డగుచున్నాడు. మరియు ప్రకటితనిజరూపుడై స్వయంజ్యోతియై "సర్వజ్ఞత, తృప్తి, స్వతంత్రత, అనాదిబోధ, అలుప్తశక్తి మొదలగు అష్టైశ్వర్యముల నొందుచున్నాడు. ముక్తులకు భగవంతుడు కూడ నియంత కాజాలడు. విధినిషేధముల నతిక్రమించి శివునితో సమానముగా కేవల మానందమునే యనుభవించుచు తమకు వలయు పదార్థములను కల్పించుకొనఁ జాలుదురు. జగజ్జన్మాదులుమాత్రము వారివలన కాజాలవు. శివునికి ముక్తునకును ఈమాత్రి మంతరమున్నను శివునితో నభేదముగా (శివోఽహమని) భావించుటయే ముక్తికి ప్రధానసాధన మగుచున్నది.

త్రిదేవాతీతమైన బ్రహ్మ నిర్గుణ సగుణాత్మకమై శివాభిధేయ మగుచున్నది. ఆదిపురుషుడైన విష్ణువు శక్తిశివుల కోటిలో చేరినవాడై మూడవరత్నముగా పరిగణింపఁబడుచున్నను ముక్తిప్రాప్యుడు కాజాలడు.

"మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్ ।
తస్యావయవభూతేన వ్యాప్తం సర్వ మిదం జగత్"

జగదుపాదానమగు మాయతో కూడియుండు మహేశ్వరుని అంశభూతుడైన పురుషునితో నీ ప్రపంచము వ్యాపింపఁబడియున్నది. ఇట్టిపురుషుడైన నారాయణుడే మహోపనిషత్తునందు ప్రాపకశ్రేష్ఠుడుగా ప్రశంసింపఁబడుచున్నాడు. ఉపాసకోపాస్యముల కుపాసనాకాలమం దైక్యము భావింపఁబడుచున్నది గావుననే వామదేవ, దేవేంద్ర, శ్రీకృష్ణాదులు "శివోహం" భావనతో గీతల నుపదేశింపవలసినవారైరి. "పురుషోవై రుద్రః" ఇత్యాది శ్రుతివాక్యములు "రుద్రుడే పురుషాత్మకుడు గావున పురుషునకు పరమేశ్వరునకును సమానత్వము కుదురదనియు, పురుషునందు శివు నుపాసింపవలసినదే గాని శివునందు పురుషు నుపాసింపగూడదనియు, పురుషోత్తము డగు శివుడే సర్వత్ర నుపాస్యుడనియు" వివరించుచున్నది.

ధర్మియైన శివుఁడు నిమిత్త కారణముగను, ధర్మమగు శక్తి స్త్రీపురుషాత్మకమై అంబికా నారాయణ రూపములతో నుపాదానకారణముగను, ఇట్టి ధర్మధర్ముల కపృథక్ సిద్ధత్వ ముండుటచే శివుడే స్వశక్త్యంశములలో నిమిత్తోపాదానోభయముగను పేర్కొనఁబడుచున్నారు.

అవ్యయము, ఆద్యము, ఆనందప్రచురము, జ్యోతిర్మయము నగు శివతత్త్వము బ్రహ్మాదిదేవతలచేతను పురాణపురుషు లందరిచేత నుపాసింపఁబడుచున్నయది. "యమేవైష

వృణుతే తేన లభ్యః" ఎట్టి దృఢోపాసకునకైనను శివానుగ్రహము లేనిది ముక్తి లభింపఁజాలదు. "భవబంధమునుండి ముక్తుడనగుటకు సమర్థుడను నేనే" యను వికారము కూడదు. భ్రమరము తనచుట్టు భ్రమించుకొలది కీటము భ్రమరమైనట్లు శివుని కృపాదృష్టి పుణ్యపాప లేపరహితుడగు తనయందు ప్రసరించుకొలది జీవుడు శివుడగుచున్నాడు. నిర్గుణుడైన శివుడు సదా జీవుల ననుగ్రహించు కరుణతో నిండియుండును. ఉపాసన స్వమాలిన్యమును తీసివేసికొనుటకే యెక్కువగా నుపయోగించునట్టిది. నిషిద్ధముల నాచరింపకుండా కామ్యముల విసర్జించి విహితములఁ గావించుచు పవిత్రాంతఃకరణమునందు శివుని ధ్యానింపవలెను. కలుషితాంతరంగుడు కాలకాలుని స్మరించుట కర్హుడు కాజాలడు. ఉపాసనలలో దహరమే శ్రేష్ఠము; ఆంతరంగికమగు దహరోపాసన సిద్ధించుటకు బాహ్యమైన లింగధారణయే ముఖ్యసాధన మగుచున్నది. ముముక్షువు స్వప్రారబ్ధాంతము శివు నుపాసించి తదనుగ్రహమువలన ముక్తుడగుచున్నాడు. ప్రారబ్ధము బ్రహ్మాండము నతిక్రమించువరకు ననువర్తించునట్టిది.

జీవున కణుత్వము గలదు కావుననే గత్యాగతులు సంభవించుచున్నవి. శివపదములో ప్రవేశించువరకు అణుత్వము తొలగఁజాలదు.

స్వర్గ నరకములు, పుణ్యపాపములు సత్యములగునట్టివి. మోక్షమునం దుపాసకుని పుణ్యములు మిత్రులకును, పాపములు శత్రువులకును సంక్రమించును.

స్థూలసూక్ష్మదశల నిమిత్తముగా జగము పరివర్తనము కలదైనను నిత్యమైనట్టిది; పృథివ్యాదులకు జలాదులు కారణములుగా కనుపడినను పరమేశ్వరుడే తత్తత్పదార్థముల యంతర్వర్తియై గారణమగుచున్నాడు. ఖండఖండములుగా నుండు అచేతనము చేతన విశిష్టమై స్పందించుచుండును. చేతను లసంఖ్యాకులు గావున నపరిమితములగు అచేతనములందు నిండి యుందురు. జీవుడొకడే స్వశరీరేంద్రియముల నధిష్ఠించి యుండునటుల పరమాత్మ యొకడే జీవాత్మ లందరియందు వ్యాపించి యున్నాడు. జగదీశ్వరులకు శరీర శరీరి భావము పొసగుచున్నది. వస్తుతః శరీర శరీరులు భిన్నులైనను ఒకదానివిడచి మరియొకటి యుండనట్లు జగదీశ్వరులు విలక్షణులై యపృథక్ సిద్ధులగుచున్నారు.

ఇత్యాది వివరముగల శివాద్వైతమును పూర్తిగా వ్రాయుటకు నెంతటి సమయమైనను సరిపడదు. గావున యథాశక్తి క్లుప్తపఱచి (శైవ) మహాజనుల ముందుంచబడినది. దొసగులను క్షమించి పొసగులఁ గ్రహింతురుగాత యని ప్రార్థించుచు విరమించుచున్నాను.

"ఋతంగ్ సత్యం పరబ్రహ్మ పురుషం కృష్ణపింగళం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వైనమోనమః"

మనోవాగ్విపర్యాసములు లేనట్టి శక్త్యంశతో కృష్ణవర్ణము, స్వాంశతో పింగళవర్ణంబును కలిగినట్టి "కప్యాసం

పుండరీక మేవ మక్షిణీ'' అను మంత్రమునందున్నరీతిగా వికసిత పుండరీక సదృశమగు నేత్రద్వయము, ముకుళిత పుండరీక సదృశమగు ఫాలనేత్రంబును కలిగి ఊర్ధ్వరేతస్కుడైన విశ్వాత్మకుడగు పూర్ణపురుషు (మహాదేవు) నకు నమస్కారము.



---

# శివాద్వైతము

| తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి |
|---|---|---|---|
| ముముక్షోఽపరం | ముముక్షోఃపరం | (రత్నపంచకము) | |
| యున్నవారుః | యున్నవారు | ౨ | ౨ |
| తంజాపూరు | తంజావూరు | ౨ | ౪ |
| లకుపీశుని | లకుతీశుని | ౨ | ౧౨ |
| సంఖ్యా | సంఖ్యా | ౨ | ౧౩ |
| సంభూతులను | సంభూతులగు | ౨ | ౧౭ |
| వైదిక | వైదికీ | ౪ | ౧౩ |
| కరణమువందు | కరణమునందు | ౫ | ౪ |
| ఆపర | అపర | ౫ | ౧౬ |
| చిదచచ్ఛక్తి | చిదచిచ్ఛక్తి | ౬ | ౩ |
| వంగీకరింతురు | నంగీకరింతురు | ౭ | ౧౭ |
| వివాదము | వినాశము | ౮ | ౪ |
| ఆకృతము | అకృతము | ౮ | ౭ |
| ప్రవాహాములో | పరివాహాములో | ౮ | ౧౮ |
| వ్రళయ | ప్రళయ | ౧౦ | ౧ |
| మహాోవ | మహాపాప | ౧౧ | ౫ |
| శివుడే | శివుడే | ౧౧ | ౧౯ |
| ములలో | ములతో | ౧౧ | ౧౯ |
| చున్నారు | చున్నాడు | ౧౧ | ౧౮ |
| భప | భవ | ౧౨ | ౨ |
| శివుని | శివుని | ౧౨ | ౫ |

ఏతదభిమానులు - రెండవ పేజీ

| | |
|---|---|
| కామర్ప్ఫు | కామర్సు |

# ఏతదభిప్రాయములు

---

బ్ర. లో. కొడిమేల భోగసోమలింగారాధ్యులవారు; వరంగల్

బ్ర. లో. సాహిత్యశిరోమణి. ముదిగొండ వీరేశలింగశాస్త్రి
గారు, వరంగల్.

బ్ర. వే. సకలశాస్త్రపారీణ, ఆత్రేయ లక్ష్మణశాస్త్రిగారు,
కారేకుర్తి.

బ్ర. వే. మహాకవి శిరోమణి, చివుకుల అప్పయ్యశాస్త్రిగారు,
సికింద్రాబాద్,

బ్ర. వే. శిరోమణి, శివంపేట విశ్వనాథశాస్త్రిగారు, శివంపేట.

బ్ర. లో. కవిశేఖర, ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు.
సికింద్రాబాద్.

బ్ర. లో. ఘట్టుపల్లి నాగమల్లయారాధ్యులవారు, సిద్దిపేట.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ పండితరత్న, మోత్రాక్ కృష్ణమా
చార్యశాస్త్రిగారు, కోరుట్ల.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ విద్వాన్, ఆచి వేంకట నృసింహాచార్య
శాస్త్రిగారు, ఆవునూరు.

బ్ర. లో. ముదిగొండ రాజమౌళి అయ్యవార్లంగారు,
లచ్చపేట.

బ్ర. లో. రామగిరి శంకరారాధ్యులవారు, లచ్చపేట.

బ్ర. లో. ముత్యంపేట చెన్నబసవారాధ్యులవారు, లచ్చపేట.

బ్ర. లో. మానకొండూరు భద్రయ్యశాస్త్రిగారు, లచ్చపేట.

బ్ర. లో. కొడిమేల విశ్వనాథారాధ్యులవారు, సిద్దిపేట.

బ్ర. లో. కాచాపురం పార్వతీశంశాస్త్రిగారు, రాజంపేట.

బ్ర. లో. తర్క-వేదాంతపారీణ, మూలంపల్లి రాజశేఖరశాస్త్రి
గారు, లచ్చపేట.

బ్ర. లో. సాహిత్య విద్వాన్, కామర్పు చంద్రమౌళిశాస్త్రి
గారు, లచ్చపేట.

బ్ర. వే. కవికులతిలక, మామిడిపల్లి సాంబయ్యశాస్త్రిగారు,
వేములవాడ.

బ్ర. వే. చొల్లేటి నృసింహశర్మగారు, హైస్కూల్
ప్రధానోపాధ్యాయులు, సిద్దిపేట.

బ్ర. లో. ముదిగొండ శంకరలింగారాధ్యులవారు, మందుముల

మరియు ప్రియమిత్రులు, ఆప్తబంధువులు, విజ్ఞశిష్యులు, మహాశయులైన విద్వాంసులున్ను.

వీరందరికి నా కృతజ్ఞతావందనములు, శిష్యులకు శుభాశీర్వాదములున్ను.

P. N. S. ౨.

## ఈ గ్రంథకర్తగారిచే వ్రాయబడిన పుస్తకములు.

**ముద్రితములు :—**

విదుర మహానీతి — ప్రథమ భాగము
(సాంధ్రతాత్పర్యము) 0—8—0

వైదికమత సామరస్యము, శివాద్వైతము 1—0—0

**అముద్రితములు :—**

గురుశిష్య సంవాదము

రామరాజ్య నిరూపణ (వ్యాసము)

ప్రదోష తాండవము (వ్యాసము)

సహస్ర కమలార్చన

విదుర మహానీతి — ద్వితీయ భాగము

నాశిష్య సంచారము (అసమాప్తము)

---

వలయువారు :—
శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు,
జ్యోతిర్వినోదినీ ప్రెస్,
సోమవారం పేట,
నిర్మల,
ఆదిలాబాదు జిల్లా.